





# కథలు

## ఉపాఖ్యానము

# రంతి దేవోపాఖ్యానము





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050015982

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# రంతిదేవోపాఖ్యానము.

(శ్రీహరి జనసేవామహిమను తెలుపు ఏకాంకనాటకము.)

గీ॥ మాలవానినేల ♦ మఱి మఱి నిందింప
నొడలు రక్తమాంస ♦ మొకటిగాదె?
వానిలోనఁగల్గు ♦ వాని కులంబేది?
విశ్వదాభిరామ ♦ వినురవేమ."

వెల

| | | |
|---|---|---|
| 1 | ప్రతి | రు 0-0-3. |
| 100 | ప్రతులు | రు 1-0-0. |
| 1000 | ప్రతులు | రు 7-0-0. |

తత్వానందస్వామి.

# రంతిదేవోపాఖ్యానము.



## ఏకాంకనాటకము.

(ప్రయ్యిమిరాది అన్నపురుషుడు ఎదురుగ కూర్చుండి రంతిదేవుడు ప్రవేశించును.)

రంతి— ఆహా! ఆకటిబాధ ఇంత యుండునే. పూర్వ మెన్నడును ఇది ఇంత దుర్భరమని ఎఱుంగనైతిని. కటకటా! నేను రాజ్యము నేలు కాలములో ఎందఱొందఱు పేదవారు ఇట్టి ఆకలి బాధకు బలియై ప్రాణములు విడిచి యుండిరో, అప్పుడు నాకు వారి స్థితిని నిజముగ తెలుపువారెవరు? ఎల్లఱును నీ రాజ్యము శ్రీమంతమై సుభిక్షముగ నున్నదనెడివారే! నేను రాజ్యము బాసి నప్పటినుండియు ప్రజాసామాన్యమును గురించియు మఱియు నిమ్నజాతినరులను గూర్చియు ఎన్నెన్ని రహస్యములో తెలియగల్గితిని. ఆశ్చర్యము! ఈ అంటరానివారు, ఈ దరిరాకూడనివారును ప్రజల మన్ననలేక రాజాదరణమును పడయజాలక ఎంత కుందిరో! నా యెడ నింతకన్న దోషమేమి యుండవలయును? ఇది చాలదా నన్నింతకు మించిన దురవస్థపాలు చేయుటకును? కటా! నేనీ ఆకలికెట్లోర్తును. ఈ అన్న మింకను ఉడుకదే!

ఇది సిద్ధమగు టెప్పుడు ? నేను తిను టెప్పుడు ? ఇం తలో సంధ్యావార్చెదగాక. (కడవలోని నీటినిచూచి) ఈ నీరును కొలదిగ నున్నది! ఎంత దూరమో పోయిన గాని ఈ అడవిలో ఒక చుక్క నీరు దొరకుట దుస్తరము. దీనిని కడు జాగ్రత్తతో ప్రాణ ప్రదముగ వాడుకోవలెను.

(పొయినాకచూచి) ఈ అన్నము సిద్ధమైనది. దీనిని చూడ జూడ, ఎప్పుడు తిందునాయను ఆరాటము పెరుగు చున్నది. దీని వాసన సోకినంతనే, ఆకలి మంటలు రేగు చున్నవి. అయినను కొంచెము నిబ్బరించుకొని సంధ్యపూర్తి గావించుకొందు గాక ! (కండ్లుమూసి ధ్యానముచేయుచుండును.)

(ఒక బక్క బ్రాహ్మణుడు ప్రవేశించును.)

బ్రాహ్మ—(తనలో) ఇతడు ఎవడైయుండును? పాపము! ఎంత కృశించియున్నాడో ! (ప్రకాశముగా) ఎవరయ్యా ! అక్కడ? ముసలిబ్రాహ్మణుడను. రోగముచే బక్కచిక్కి యున్నాడను. మూడుదినాలుగా అన్నములేదు. ఈ నట్టడవిలో ఆదరించువారెవరు ?

రంతి—బ్రాహ్మణశ్రేష్ఠా ! ఇదె రంతిదేవుడు ప్రణమిల్లు చున్నాడు.

బ్రాహ్మ—రంతిదేవుడవా ? సకల రాజ్యసంపదల గోల్పోయి పెద్దమ్మకు పెద్దకొడుకువై యుంటివట! నీకథ అంతయు విన్నాను. నాకర్మము నాకుదేవుడు నిన్నేచూపవలయునా? నీకే లేనప్పుడు నాకేమి పెట్టుదువు ? మరొక

చోటికి పోదుగాక. ఈ సమీపమున ఇంకెవరేని జనులు గలరా? నీవొక్కడవే ఈకారడవి కడుపున దాగియుంటివా?

రంతి—విప్రవరా! ఇత్తరుణమున, శ్రీహరికటాక్షముచేత, నాకడ ఏమియుదొంటకదని చెప్పనవసరములేదు. కొంచెము అన్నము నీరు మాత్రమున్నవి. నాయందు పూర్ణానుగ్రహముంచి వీనిని స్వీకరించుడు.

బ్రాహ్మ—అట్లనా? ఇప్పుడు మాకవియే పంచభక్ష్య భోజ్య పానీయములు కాగలవు. అమృతము దొంటకినట్లే! బ్రాహ్మణు లీనాడు తమ పచ్చచూచుకొనిగాని, ఇతరుల గోడుపెట్టుకొనరు. పెట్టుము పెట్టుము! నీమాట తరువాత విచారింతును. అప్పుడు సామంతరాజుల నేలితివి. ఇప్పుడు కొండద్రోపుడుగాండ్ర నేలుచున్నాడవు కాబోలు! ఎక్కడనున్నను రాజువేగదా! నీవెటుల సంపాదించితివో విచారించుపాటి స్థితిగాదు. ఆకలి! ఆకలి! పెట్టుము. అన్నము పెట్టుము!

రంతి—శ్రీహరీ! ఈ అన్నము అన్యాయార్జితముకాదు.

బ్రహ్మ—ఆగోల ఇప్పుడెవరు అడిగిరి? ప్రాణములు నిలుపుదువా? బ్రాహ్మణ హత్యకు పాల్పడుదువా?

రంతి—ఇదె అన్నమిడుచున్నాడను. (సగము అన్నమును సగము నీటిని ఇచ్చును. వానిని బ్రాహ్మణుడు ఆరగించును.)

బ్రాహ్మ—తృప్తితీరె; తృప్తి తీరె. ఇంకొకప్పుడైనచో, దీనికి అయిదింతలు మెక్కెడివాడనే. రోగముచేతను, ఉప

వాసముచేతను జఠరాగ్ని చచ్చియున్నది.—నీకు సకలా
ఇష్టార్థప్రాప్తిరస్తు. అటపోయి దూరముగ చెట్టునీడను
పరుండును. నీవును భుజించుము. ఆకలిగొని యుందువు.

(బ్రాహ్మణుడు నిష్క్రమించును)

రంతి—ఆహా! ఏమి నాఅదృష్టము. ఈ పుణ్యబ్రాహ్మణుడు
అతిథియై వచ్చుట, వట్టిఅన్నము నీరు పుచ్చుకొని తృప్తి
పడుట, మఱియు నన్నాశీర్వదించిపోవుటయు నా? అయి
నను నాయిష్టావాప్తి యేమగుండగలదు? ఈమాత్రానకే
**నాకోరు** శ్రీహరిదర్శనముకాగల్గు**నా?** ఇది తర్కమునకు
అదను కాదు. ఆకలి దహించుకొని పోవుచున్నది.
బ్రాహ్మణ భుక్తాన్న శేషమును భుజింతును.

రంతి—(అన్నము పెట్టుకొనబోవుచుండ ఒక ఆర్తధ్వని విన
రాగా దూరముగ దృష్టి నిగుడించిచూచుచు)
ఏమైయుండును ఈ ధ్వని? ఎవరో ఆర్తిపాలై దీనముగ
ఏడ్చుచున్నట్లున్నది. త్వరగా భోజనము ముగించుకొని
పోవుదుగాక! (తనలో) ఆహా రంతిదేవా! స్వమాత్ర
ధర్మము నీతలోనే మఱచితివా! ఆర్తపరిత్రాణము
కన్న నీకడుపు నింపుకొనుటని నీకు ముఖ్యమై తోచెగా!
కానన నీగతి ఇట్లయ్యె—క్షమింపుము క్షమింపుము.
అంతర్యామీ! నీ ఆదేశమును శిరసావహింతును. (ధ్వని
వచ్చువైపుచూచి) అల్లదిగో ఒక బక్కచిక్కిన కుక్క..
అయ్యో! నడువలేక పడిపోవునట్లున్నదే? (అని ఆతుర
పాటుతో అన్నపు కుండను నీటినితీసికొని పర్విడుచుండ
ఒక మాలడు ప్రవేశించును)

మాల—ఓదొరో ఓదొరో!

రంతి—(వినకయే పర్విడిపోవును)

మాల—అయ్యో! బాబో, ఈఆకటిలో సత్తా? ఇంకేముంది దిక్కు? (కూలబడి రంతిదేవుడు పోయిన దిక్కుచూచి) ఇంకా ఆశేముంది? అన్నం అంతా ఆ పాడుకుక్కకే యేశేశాడు. అంతా దులిపేసి పెట్టాడు. అయ్యో! నీళ్లుకూడా అన్నీ పోశేస్తాడుకామాల్సు. రెండుపరుగుల దూరంలో యెక్కడా నీళ్లే దొర్కవే.

(రంతిదేవుడు ప్రవేశించును.)

రంతి—(తనలో) ఈ మానవుడు ఎవరై యుండనోపు?

మాల—ఓదొరో? లెగలేను. ఇక్కడనుంచే దండమెడ్తా.

రంతి—అన్నా నీవెవ్వరు?

మాల—నేనా? వోమాలోణ్ణి. దోవతప్పి. చాల్దూరాన్నుంచి నత్తుండా. బలే ఆకలేత్తుంది! పానాలు పోతున్నయ్. కూత్తిబువ్వెడతావా? లేదు పో అంటావా?

రంతి—(తనలో) కటకటా! యేమనిచెప్పుదు! చెప్పకతీరునా?

(ప్రకాశముగా)

ఉ. అన్నములేదు. కొన్ని మధురాంబువులున్నవి త్రావుమన్న;

మాల—సంది? అట్టేడుత్తావు? నీళ్లు చాలా దూరాన్నుంచి తెచ్చావనా! దప్పిత్తే మంచిదేలే!

రంతి—రమ్మన్న శరీరధారులకు నాపదవచ్చిన వారియాపదల్ ద్రెన్నసమాన్పి వారికిసు ఖంబునుగూర్చుటకన్న నొండు మే లున్నదే?—

**మాల**—మరి నీకో!

రంతి—నాకుదిక్కు పురుషోత్తముడొక్కడేసుమ్మీ పుల్కసా॥

**మాల**—బలేవోడవయ్యా! పాయ్‌పాయ్ పీకెండిపోతుంది. (రంతిదేవుడు నీళ్ళన్ని పోయగా, త్రాగి) బలేనీళ్ళండి! అమృతం, పానకాలే! ఆకలికూడా తీరే నీళ్ళే యియ్యి. మరిగత్తే దొరా! నీవోరండి.

రంతి—నేనొక రాజును. నాచరిత్ర ఇప్పుడు చెప్పుకోతగినదిగ లేదు.

**మాల**—రాజువా! నిజంగానా దొరో! మరిగత్తే ఇట్టుండావేంది? ఆ చిరుగుడ్డ లేంది? కడుపు యీపుకంటుకొయిందేం? బువ్వతినవూ? జబ్బా? కోయదొరవేనా?

రంతి—నేను కోయదొరనుగాను. ఒకప్పుడు గొప్పదేశమును పాలించినవాడను. రంతిదేవుడను పేరిటివాడను. కాలకర్మ వశమున ఆరాజ్యము శత్రులపాలైనది. నేనీకారడవుల పాలైతిని.

**మాల**—నరపురుగు దూరలేని, యీ నట్టడవిలో వుండావేం? యిరోదులొచ్చి కనుక్కుంటారనా?

రంతి—కాదుకాదు. సర్వజీవులును, శ్రీహరికృపచేత, సుఖదుఃఖములను అనుభవించుచుందురు. ఆజగన్నాటక సూత్రధారుడు తోలుబొమ్మల నట్లు జీవులను ఆడించుచుండును. అది వానిలీల. జీవులు అహంకరించక, వాని లీలాసంకల్పమునకు తలయొగ్గిన కృతకృత్యులగుదురు. ఆదేవుడు ఎక్కడ నెట్లుంచిన, అట్లుండి తృప్తులగుట సమంజసము.

మాల— మరిగత్తే! నీకు బువ్వోరొండిపెడ్తారు ?

రంతి—కాయ,కసవు తిని కాలముగడప నెంచితిని. క్రొత్తతావు. అవియు దొఱకుటలేదు. దాపున కొన్ని వెదురు పొదలు కాన్పించినవి. ఆ వెదుళ్ళను చీల్చగా కొద్ది బియ్యము లభించినవి. వానిని వండితిని.

మాల—ఆ కాస్తాతినేశావు కామాల్ను. కాత్తుంటే, ఆ పాడు కుక్క కేశినట్టుండావు. నాకైనా పెట్టావుకావు.

రంతి— నేనును తినలేదు.

మాల—యేంటీ! అసలే కాత్త కామాల్నా! అది కాత్తా కుక్కకెట్టావా ? యేం మడిసివి దొరో ! ఆ కుక్క పడిసావా ? దానికెట్టావేంది ? నీవు తినకుండా నేనా ? ఆకలికి వాడి పోయ్యుండావు!

రంతి—మొదట నేను తినబోవుతరిని ఒక బ్రాహ్మణుడు వచ్చి నాడు. వానికి ముందుగా సగము అన్నము నిడితిని. మిగిలినదానిని ఈ శ్వానమున కిడితిని.

మాల—అదేంటి దొరో! రోజురోజూ ఏవ్వాల్లోపడ్తే ఆవ్వాల్లో తద్దినాల పండుగలు ! బాపనాయనకేంకొదవ ? పొట్ట పిక్కటిల్లేట్టు తి ట్టారే. ఎంత పిచ్చాయనవు దొరో! నీకు లేకుండా పెట్టావా? బాపనాయనకేం? ఒక్కనాడు తింటేచాలు. లొట్టపిట్ట కడుపులు ఆళ్ళి ! పదిరోజు లైనా వుండగలరు ?

రంతి—అటులనదగదు. అతిథి ఎవరైనను దేవునివలెనే చూడ వలెను. అందునను బ్రాహ్మణోత్తముడు! దర్శన

మాత్రానే మనస్సును భగవంతుని వైపు త్రిప్పు పవిత్రజీవి!

మాల—పోనీ! మిగతాదైన తినక ఆ పాడు కుక్క కీశావేం! ఒక్కచ్చనం ముందైనా నచ్చానుకాను.

రంతి—ఆ త్రిపాత్రయుండగా కుక్క ఏమి మఱొక జీవియేమి?

మాల—మరిగత్తే బాపనయ్యని సూసినట్టు కుక్కన్ని సూస్తావా?

రంతి—సమానగానే చూడవలెను. అన్ని భూతములలో నున్నదియు ఒక్కదేవుడే! * ఎవరిని ఆదరించినను దేవుని సేవయేసుమీ? అతడే వేలువేలు జీవులలో వేలువేలై ప్రకాశించుచుండును.

మాల—ఆ కుక్క నీకు దేవుడల్లే కనపడ్డదా?

రంతి—సర్వభూతాంతర్యామి దానిలో లేకుండునా?

మాల—నైనైతే ఒక్క యేటుకు చంపి తినేశేవోణ్ణి. అయితే ఇది ఒక్కకుక్క. అంతా బొయికలే.

రంతి—ఇట్టిచేష్టలు దోషములు. హింసచేయతగదు.

మాల—వోరిదర్మాలు ఆల్లయ్యి. మాదర్మం అదంట.

రంతి—"అహింసా పరమోధర్మః" అని శాస్త్రము. దీనిని కాదని ఎవరిధర్మమును నుండదు.

మాల—మొన్నో దొర్నడిగా. బాపనయ్య కాదులెండి. పెద్ద జందెంవుంది మళ్ళేను. ఆను నన్నాడుగందా! "మేమూ

* శ్రుతిః ఏకోవశీ సర్వభూతాంతరాత్మా। ఏకం బీజం బహుధా యఃకరోతి.
శ్రుతిః అగ్నిర్యథైకో భువనం ప్రవిష్టోరూపం రూపం। ప్రతిరూపోబభూవ। ఏకస్తథా సర్వభూతాంతరాత్మా రూపంరూపం. ప్రతిరూపోబహిశ్చ.

తింటాం."—ఏది? మాంసం. ఆతమాంటా! అదేందో, ఈ శరీరంలో వుంటుందంట! అదే కామోల్ను నీవు దేవు డన్నావు దొరా! శరీరంకోసుకుతిన్నా, దానికి నొప్పి లేదంటగా? ఇంకాపాపం ఏంటి?

రంతి—ఇందొక రహస్యమున్నది. అది అందఱికి తెలియదు. దేవపూజలుచేసి, ఆత్మసాధనలు సాగించియు, మనలో నున్న ఆత్మను తెలిసి ఆ ఆత్మమయమై నిలిచేవఱకు, మన జీవుడు శరీరంతో కలసిపోయి యుండును. అంతవఱకు శరీరాన్ని హింసించితే జీవునికి హింసయే. అటుల జీవ హింస చేసేవానికి పాపమే.

మాల—తెలుసుకున్నాంక సంపినా పాపం లేదంటారుగా?

రంతి—అప్పుడును పాపమే. కాని ఆత్మతానైయుండి, తాను దేహంకాదని ఎఱిగినవాడు, తుచ్ఛమైన నాలుకరుచి కొఱకుగాని, మరే ఇంద్రియసుఖముకొఱకుగాని, జీవ హింసచేయుటే పొసగదు.

మాల—మరిగత్తే, నేను సాలాపాపాలు సేశానన్నమాటే? ఇప్పుడు మానేస్తే ఆపాపాలు పోతయ్యా?

రంతి—దానికి ఒక ఉపాయం కలదు.

మాల—చెప్పుదొరో! చెప్పు. నాకుబయమేత్తుంది.

రంతి—ఈశ్వరపూజనమువలన పరిశుద్ధుడవు కాగలవు.

మాల—మరిగత్తే నాకు మంతరాలు రావ్గా?

రంతి—అక్కఱలేదు. భజనచేయగలవా?

**మాల**—మాగూడెంలో సేస్తారు. నన్నుకూడా సెయ్యమంటే సేస్తాను.

రంతి—సర్వభూతదయ కూడా నుండవలెను. అందఱిలో దేవుడున్నాడని తెలియవలెను.

**మాల**—నాలో వుండాడా? నేను పెద్దింటోణ్ణిగా!

రంతి—ఉన్నాడు ఉన్నాడు. నీలోను ఉన్నాడు.

**మాల**—నాలో ఆణ్ణిసూశావా? పెద్దింటోడిలో పెద్దకులాలోళ్ళకి దేవుడు కనపడే రోజులొచ్చాయా? నీవు నిజాగా నాలో దేవుణ్ణి సూశావా?

రంతి—ఈ కండ్లకు కనబడకపోయినను, వానిని సర్వభూతములందును చూచే కన్నుకలదు.

**మాల**—నీకుందా?

రంతి—నిర్మల కరుణగలవారికి అందఱికిని ఆనేత్రము లభించును.

**మాల**—అది మొలుచుకొత్తుందన్నమాటే?

రంతి—అందఱికిని అదిపుట్టుకతోడనే ఉండును. చిత్తము నిర్మలమై, కరుణారసము ఉప్పతిలు వఱకును మూసికొనియుండును.

**మాల**—ఏంసేస్తే తెఱుసుకుంటుంది?

రంతి—నీవు భజనచేయి. ఎవరిని హింసించకు. అందఱియెడల కరుణగల్గి ఉండు. ఎల్లప్పుడు రామనామస్మరణ చేసికొనుచుండుము.

**మాల**—నీవట్టా సేస్తావుకామాల్సు. అందుకే కుక్కలో, నాలో దేవుడు నీకు కానొచ్చాడు. నేనుగూడా కుక్కలో

దేవుడున్నాడను కుంటా! దాన్ని సంపడం మానేస్తా. ఇం కేంటి? అందర్లో దేవుడు నాక్కనపడాలని పట్టుపడ్తా! ఏం? జీవాల్ని తినకపోతే బతకలేమా? దేవుణ్ణి ఎతికి పట్టుకుంటాగా! నాది బలేపట్టు! సూశారో లేదో!

రంతి—నీవు ధన్యుడవు. నీ నిర్మల సంకల్పమే నీకు దీక్ష. అట్టి పట్టు మాకును అమరినచో ధన్యులమే.

మాల—మీారు గొప్పోళ్లుగా! మీాకు సొంత శత్తుంటుంది. దేవుణ్ణి మరుత్తారు. మాకేంగితుంది? వోరూ సెప్పరుగాని, మాకీ నీతుల్నెర్తేనా? నిన్నప్పుడు సెప్తే, మా బాగా అంటుకుంటై! ఇక మేమొదుల్తామా?

రంతి—ఆ హరమే నిన్ను రక్షించును. "హరేరామ, హరే రామ" అనుకో.

మాల—నాకంతరాదు. "రామ,రామ,రామ" అనుకుంటా. పానం అంతా దానిమీాద పెడ్తానన్నమాటే! నీవు చెప్పావుగా! ఇంకా వదుల్తానా?"రామ,రామ"అంటూ, నాపానాలు పోవాల్సిందే!—మరిగత్తే నీకు అన్నం లేదాయా నీళ్ళు లేవాయా. ఎట్టా? బాదగా లేదూ?

రంతి—నేనిచ్చిన నీళ్లను నీలోనుండి ఆరగించిన దేవుడే నా ఆకలి దప్పులను తీర్చును లెమ్ము.

మాల—నిజంగానా? దొరో! నాలో దేవుడున్నాడా? నాలోపల యేదో కదుల్తుంది! బలే వుత్సాగంగుంది! ఆనందం పట్టలేను. ఎల్లొత్తా. దొరో ఎల్లొత్తా. నాలో దేవుడే?

యేమాన్వరా! "రామ, రామ, రామ, రామ, రాను,"
దీన్నొదలగూడదు. "రామ, రామ, రామ, రామ".
(నిష్క్రమించును)

రంతి— (సంభ్రమముతో మాలడుపోయిన దెసనుచూచి) బాపురే! బాపురే! ఏమివింత! ఆమాలడు కొంతదవ్వేగి, నాపైపుతిరిగి, దండమిడుచు చేయెత్తినాడు. వాని హృదయసీమనుండి దివ్యజ్యోతి యొకటి వెలువడినది! కోటిసూర్యప్రకాశమానమై అది వానినెల్ల కప్పివేసినది! అహా హా! ఆవెలుగు దశ దిశల నిండుచున్నదే! నాదిశకే వచ్చుచున్నది! నన్నును ఆవరించి సర్వవ్యాపకమైనది. (ఒక మహాతేజము ఎల్లెడలవ్యాపించి గోచరించును.)

దండకము.

శ్రీమన్మహాదేవదేవా లసద్దివ్యభావా! పరంధామనామా నిరాపాయజ్యోతిర్మయా! కోటిసూర్యప్రకాశా పరేశా! హరీ నీవగావే నభంబంతటన్ దివ్యతేజోవిలాసంబుగల్పించి యొక్కొక్క గోళంబు నాదద్భుతంబైన నీ వెల్గులేశంబులన్ బంచి నావిట్టి వేయింతగా దుర్నిరీక్ష్యంబునైచుర్ ప్రకాశింపగా నింక నీ స్వప్రకాశంబు వీక్షింప నూహింప లక్షింప నెవ్వాడు శక్తుండగున్, గాన నే నీవు కారుణ్యమున్ జూపి భూతాళికిన్ శ్రేయమౌలాగు నీయంశమౌ అగ్నినిన్ చాల భాగంబు అవ్యక్తమై భూతలంబంతటన్ నిండియుండంగ నాజ్ఞాపనంబున్ దగన్ చేసి నావంట సర్వేశ్వరా బ్రహ్మరుద్రేంద్ర విష్ణ్వాదులున్ నీ స్వరూ

పంబు జూడఁగలేరన్న, నేనెంతవాఁడన్ నినున్‌గాంచ, పూజింప, వర్ణింప, పాదంబులన్ బట్టి దండంబులర్ బెట్టగా! స్థబితం జెందితిన్, అన్నియుం నీవయైయుండ, నే దిక్కు నీవుండు వంచించి వీక్షింపుదున్! అంతయున్ నీవయైయుండ పాదంబు లేవంక గుర్తింపుదున్? మానసంబందు సకల్పముర్ జేయ సాధ్యంబు గాకుండఁగా నెట్లు వర్ణింపుదున్? ఏమియున్ లేకయున్ ఏమియున్ కాకయున్ అంతయున్ నీవయైయుందువో సచ్చిదానంద! ఓ నిత్యకల్యాణ! ఓ అండపిండాండ బ్రహ్మాండ సామ్రాజ్యరాజాధిరాజా! భవన్నిత్యకల్యాణకారుణ్యదృష్టిన్ ముదంబార నీ దీనునిన్ జూడవే! ఇతెకన్నన్ ఘనంబౌ వరంబేల తండ్రీ! మరిన్ వ్యక్తమో, లేక అవ్యక్తమో! ఏందు నేను డింన్ నీదు తేజోంబుధిన్ గాక వేఱందుభోను స్ననున్ గర్భమందున్ దగన్ దాల్చి రక్షించు భారంబు నీదేగదే! నీవె నాతల్లియున్ దైవమున్ త్రాతవున్ భ్రాతవున్ భక్తియున్ ముక్తియున్ సర్వమున్ నీవె! నీ తేజమింక న్నరింపంగజాలన్ దయాదృష్టి వీక్షింపవే నన్ను రక్షింపగా రావె దేవా నమస్తే నమస్తే నమః.

(దండకమును చదువుచు రంతిదేవుఁడు మూర్ఛిలును.)

(తే జ స్సు లో నుం డి ధ్వ ని.)

తేజ—కుమారా! భీతిలకుము; ఆశ్చర్య చకితుఁడవును గాకుము.

(రంతిదేవుఁడు తెప్పిరిలి నిలుచును)

నా అనుగ్రహమున స్థిరచిత్తుఁడవైతివి. అతి కఠిన పరీక్షలకు లోను చేయగా ఉత్తీర్ణుఁడగు శిష్యుని చూచి ఆచార్యుఁడు ముదమందు తెఱవున, భక్తుని తీవ్రాగ్ని పరిశోధనల పాల్చేసి, నిర్మల హృదయుఁడై ధర్మపరాయణుఁడై నా యెడ విశ్వాస

మును వీడని బిడ్డలై నిలుచుచో, వానికి వరముల నవ్వారిగ నిచ్చి ప్రోతును. అది నాలీల. నీవు అట్టి పరీక్షకు తాళితివి. లోక జీవనరీతులన్నియు నా లీలలే. వానిలోని కొన్ని రహస్య ముల నీకు తెలిపెదను. వాని నెఱుంగుటచే నీకు శుభమగును. సర్వజీవులును, వారితో బాటు సంఘములును వారివారి కర్మల ననుసరించి నాయుపరప్రకృతి లీలాచక్రమున బంధింప బడి యుందురు. దానితో పరిభ్రమించుచు నుందురు. కొంత కాలము ఉద్ధతినున్నవారు నిమ్నదశలపాలగుదురు; నిమ్నదశ నున్నవారు ఉన్నతసంఘముల సేవలనందు తరుణమును కాంతురు. చూడుము. భరతఖండమున కొండొకకాలమున బ్రాహ్మణులు అగ్రగణ్యులై వెలసిరి. సర్వజనంబుల పూజల నడసిరి. ఇం తలో వారి తెలివికి ఆవరణమైన గర్వము ప్రవర్ధనము గాంచి నది. విప్రుల చెప్పుచేతలలో నుండిన రాజులు లోకరక్షణ భారమువహించు తమ భుజబలపరాక్రమములయొక్క ప్రాధా న్యతను గ్రహించి విప్రుల దిరస్కరించిరి. విప్రులు లొంగి రాజులకడ మంత్రులై మెలగిరి. ఇట్లు కొంతకాలము చనగా గర్వోద్ధతులై రాజులు భోగపరాయణులైరి. దేశసౌభాగ్య నిర్మాతకారణులగు వైశ్యుల పీడించి వారుకూర్చిన సంపదల హరించి, విప్రులతోగూడి పంచుకొనసాగిరి. మరికొంతకాలము నకు ప్రజలందఱి భోగైశ్వర్యములకును,వారిసుఖములకునుఆధా రములగునవి తమధనరాసులేగదాయని గ్రహించి ఈ వైశ్యులు, క్రిమముగా రాజులకుఋణముల నొసగుచు క్రమక్రమముగ, వారి ఆయుధములనుభుజబలపరాక్రమములనేగాక విప్రునివిజ్ఞానరాశిని

సయితముతమదాస్యమునకై వినియోగించుకొనుస్థితిని పరికల్పించు కొనిరి. ఈవైశ్యులును మాయావశులై తామే సర్వమునకును ఆధారభూతులై వెలయుచుంటిమని దుర్గర్వమున చెలరేగిరి. ఎవరి నిష్కపటసేవయు నిరంతరపరిశ్రమయు ఎల్లసంపదరాసులకు మూలాధారములో, ఎవరి త్యాగము ఎల్లజీతృష్ణానలమునకు ఇంధనముకాగా వారివారి ప్రతాపము వెలింగెనో అట్టి పారిశ్రామికులగు శూద్రులను సర్వజనులును విస్మరించిరి. వీరిని విద్యాగంధమునకు దూరులచేసిరి. కొందఱను అతి నీచసేవలందు నియోగించి వీరి ఆత్మగౌరవమును హరించిరి. వీరుతమ మానుషత్వమునే మఱచి, తామొకరీతి ద్విపాదపశువుల మనుకొనునంతగా భ్రాంతులను చేసివైచిరి, ఎన్నడును ప్రబోధముగాంచని పెద్ద నిద్దురంబడు నటుల ఇంద్రజాల ప్రయోగముజేసిరి.

ఈ జనసంఘములు మేల్కాంచుచో, వీరియందణగియున్న ఆత్మగౌరవము, ఆత్మవిశ్వాసము, ప్రబోధముగాంచుచో నిరాడంబర జీవనసూత్ర ప్రచారము నిరాఘాటముగసాగి సమస్తమును తారుమారై విలయముచేకూర్తురు. ఈలోపుగ ఉత్తమసంఘజనులు, బుద్ధిగఱచి, కోడిమానవులను పశువులనుగజూచుచు తాకుటకును అంగీకరించక, వారిహృదయాంతరాళమున వెలుంగు నన్ను సయితము అవమానింప జూచినందుకు త్వరలో ప్రాయశ్చిత్తము జేసికొంద్రుగాక! ఎవరిసేవలు తమయుద్ధతికి దోడుపడెనో, వారిక్షేమలాభముల సంరక్షించుచు వారికి సేవలజేసి, తమఋణముల బాపుకొంద్రుగాక, ఎవ్వారిహృదయములందు నా తేజము సంప్రీతిమెయిదాగి యుండెనో, అట్టి ఈహారిజనులను

పోషించి పునీతులగుదురుగాక! నిజముగా వీరే నాపాదసరోజ సంజాతులు! నాపాదార్చన గోరువారు వీరినిముఖ్యముగా ఆదరించవలయును!

రంతి——దేవా! ఈమాలనియందావేశించి, నా క్షాత్రగర్వమడంచి సమబుద్ధిని పురికొల్పి నన్ను ధన్యుని చేసితివి.

తేజ——నేనిప్పుడు వానియందావేశించితి ననుటయు సరికాదు. నేను సదా వానియందధివసించుచునే యున్నాడను.

యోమాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి
తస్యాహం న ప్రణశ్యామి సచమే న ప్రణశ్యతి.

నన్నెవడు సర్వత్ర సర్వభూతములయందు చూచునో వానికి నేనెన్నడును కనబడకుండను. అతడు నాకును కనబడకయుండడు. అజ్ఞానముచేత మీ స్థూలదృష్టికి నీచదశలనున్నవారిని తిరస్కరించితిరా మీరును నాచే తిరస్కరింపబడక తీరదు. నీవు ధన్యుడవు. మాలయనక వానిలో నీవు నన్ను గుర్తించి సేవించితివి. సంతసించితి. నీ కోర్కెలు తెలుపుము. సఫలముచేసెద.

రంతి——దేనిని చూచిన వెనుక కోర్కెలు మరి తోచజాలవో, అట్టి నీపరమ తేజమును గాంచితి. నాయెడ కోర్కెలుండుట అసంభవము.

తేజ——నాయెడ నింత భక్తి చూపితివిగదా, ఏమర్థించెదవు?

రంతి——నాభక్తిని మూలధనముగ నిడి నీతోడ బేరము సలుప బోను. నీపాదారవిందసేవకు అదియే ప్రతిఫలము. అయిన

ఈ భరతవాక్యము ఫలించుగాక.

భక్తి జ్ఞాన వైరాగ్యములు సిద్ధించి సర్వజనులును సమబుద్ధికలిగి నిష్కాపాని సేవ బూని సుఖులై స్వస్థులగుదురుగాక.

తేజ—తథాస్తు తథాస్తు.

మంగళం.

---

# అనుబంధము.



భాగవత్ప్రకీర్తనము.

"శుభములం దశుభములందు శోకమోహ
ములను మానమునకు **నా**డికా చలనములగు.
ఎల్లరు వధూవరులు నేనె; యెల్లయీప్సి
తములు నేనె; మనోవికృతములు నేనె.
**నా**కు స్వీయాశ్రయములు, బాధములు లేవు;
సర్వమొక్కటియె **నా**కు! సమధికస్వ
భావములు నన్నియును నేనె; పరమశత్రు
మిత్రులందును సమముగ మెలయునట్టి
నిర్గుణబ్రహ్మమును నేనె! నిఖిలవస్తు
సముదయమ్ములు **నా**కు వశమ్ములయ్యె.
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః."

ఓం.

శ్రీహరిజనమాతాపితృభ్యాం నమోనమః.

పుట్టుక చేతకన్న చిట్టుక ఆచరణ చాలమేలు.

ప్రతి భారతీయుడును ఋషిసంతానమనియు, భగవత్సేవకుడనియు మఱువదగదు.

తన ఆత్మోన్నతికై సర్వవిధములు పాటుపడుటయు, ఇతరుల ఆత్మోన్నతికి అడ్డు పోకుండుటయేగాక వారి ఆత్మోన్నతికి చేతనైనంతవఱకు తోడ్పడుటయు ప్రతి నరునకును విధాయక కర్మము.

వర్ణభేదము కేవలము గుణకర్మలచే కల్గునేగాని పుట్టుకచే వచ్చునది కాదు.

ఒక సోదరమానవుని నీచునిగా భావించువాడు వేఱొండు తనయందున్న తన యాత్మనే అవమానించుకొనినవాడగుచున్నాడు.

ఉత్తమకులమున పుట్టితిననుకొనువాడు, అట్టి ఉత్తమ కులమునకు అర్హములగు సద్గుణములను పూర్ణముగ కలిగియుండి సదాచారపరుడు కాకయే తాను శ్రేష్ఠుడని తలంచునెడల తన కులమును తన దేశమును అధఃపతితము చేసినవాడగుచున్నాడు. అట్లనే నీచకులమున పుట్టితిననుకొనువాడు ఉన్నతి సాధించి ఉత్తమదశకు రాజాలననియు, అందుకు అర్హత లేదనియు తలంచునెడల అట్టివాడు తన కులమునకును తన దేశమునకును ద్రోహము చేసినవాడగుచున్నాడు.

సర్వం ఖల్విదం బ్రహ్మ!

ఓమ్ తత్ సత్.

శ్రీ సద్గురుపరబ్రహ్మణేనమః

# భవరోగమునకు మంచిమందు.

కలికల్మష నివారణ మంత్రము.




ఓమ్. హరే రామ, హరే రామ
రామ రామ హరే హరే.
హరేకృష్ణ, హరేకృష్ణ,
కృష్ణకృష్ణ హరేహరే.

ఈమంత్రం ఉదయం 16 సార్లకు ఎంత ఎక్కువ జపించితే అంతమంచిది.

## శ్రీరామతారక మంత్రము.

ఓమ్. శ్రీరామరామరామేతి, రమేరామే మనోరమే
సహస్రనామతత్తుల్యం, రామనామవరాననే

ఈమంత్రం సాయంత్రం 16సార్లకు ఎంత ఎక్కువ జపించితే అంతమంచిది.

లౌన తాగ మాని పల్లెలంట చారమెంటో చే
తాను సూడ టంటిగాదె? తాగివస్తి! నాయమా!

6. బుద్దిసెప్పి కూలికొచ్చి బూట కాలకెత్తి వా
ఉద్ది కూడి కూలిసేసి పైకమిచ్చి వేసి యీ
ముద్దరాలు సౌదతేను ముందు నిన్ను పంపితే
పొద్దుగూకె నిప్డు నీకు పొద్దుగాల సోమరి.

సంపూర్ణము.



చెన్నపురి: శ్రీ 'రామ' ప్రెస్సున ముద్రితము.—1939.

(ముప్పురు కలిసి)

1. శ్రీలనేలు రత్నగర్భ చిక్కి చిన్నపోయెరా
పాలవెల్లి పల్లగిడ్డి పట్టిపేదలాయెరా
నేలయీను పాడిపంట నేల మట్టమాయెరా
ఆలుగోల బాలగోల అన్నచూడ వేమిరా.

2. తూరుపార సూరుడొచ్చె తూలి సోలి వత్తు
కాపుకూత రేతిరెల్ల కాల్వలోన పంట[illegible]
ఆరు రోజుకూలి కల్లుకై తెగలుబడ్డ[illegible]
దారుతల్లి కూటికేది దారిగుడ్డ [illegible]రా.

3. అన్న తాగనంటె వొట్టులంటి [illegible] కూలిలో
చిన్నిపాప నుగ్గుపాలు చీకు తల్లి[illegible] పా
తన్ను మింత గంజితోడ ఆరగింతునం[illegible]
కన్న తల్లి ఆలి యేడ్వ కల్లుతాగి నస్తివా.

4. ఒల్లు గుల్ల ఇల్లు గుల్ల ఓకిరింతు రెల్లరూ
కళ్లు గుంత లాయె తల్లొ గంటుపడ్డ దెబ్బకే
పల్లకర్డు గట్టె అన్నకల్లు ఊడె చూచుకో
పిల్ల చూరగాదు భీతిపెద్ద భూతమంమనో.

5. తానమాడి గంజితాగి ధర్మమెంతో సద్గి, నూ
లాన మంతులంటి గాంధి లాలతిల్క రోజిసీ